# బుద్ధ

చలం

బుక్ సెంటర్
విశాఖపట్నం - 1

గ్లోరిస్
హృదయంలో
అవతరించి
దర్శనమిచ్చిన
ఈశ్వరుడికి
సమర్పితం

౧

యామినీ శిరోజ దీప్తజ్వాలా కుసుమాలు
తేజోతల్పంపై రాలి
అదృశ్యమైనాయి

రవి కిరణాంగుళీ నఖక్షతాలతో
శ్యామలాకాశం కందింది

అరుణాచలేశ్వర వామభాగాన
కుంకుమ పూజ జరుగుతోంది

చెలునో !

## ౨

నీ కళ్ల కడగంటి చూపుకై ఆసక్తిపడ్డ జ్యోత్స్నాప
ముకుళిత కరుడై
నిలిచిపోయినాడు
గవాక్షం వద్ద.

తల్పపార్శ్వానికి చేరిన నీరెండ
నీ నిద్రావగహిత మానసాన్ని
నూతన దినోత్సవాని కాహ్వానిస్తోంది

కేతకీ పరిమళాసక్తుడై వొచ్చి
నీ ధమ్మిల్ల తమోమర్మంలో చిక్కుకున్న
మలయానిలుడు
విముక్తికై ప్రాధేయ పడుతున్నాడు

కళ్లు తెరు !

3

రా నాతో అరుణాచలంపైకి !

మర్రిచెట్టునీడ
సెలయేటిధార
పెదవులపై పాట
నువ్వు నావెంట

నవ వికసిత పుష్ప మకరందం తాగి
మత్తెక్కి-పాడే ఈలపిట్టలు,
రావి చిగుళ్ల నునుపుతో
మృదువుగా తాకే గాలి తెమ్మెరలు,
దూరంగా ధ్వనించే గుడిగంటలు
శిఖరంచుట్టూమూగే మేఘాలనీడలు
కొండగడ్డి అడవిజాజుల పరిమళాలు

ఆకాశ వలయాల్లోంచి
గరుడుడి జాలి పిలుపు
ప్రియుడికై మూలిగే పావురం వలపు !

రోహిణీ సమేతుడై
ఆకాశ సదనాల
క్రీడించిన తారాపతి
ఒంటరిగా
అపరాంబుధీ
స్నానాయత్తుడౌతున్నాడు

ఈనాటి రాత్రికి
అతనితో వియోగమని
రోహిణికి
తెలుసునో-లేదో

౫

కోయిల కూస్తోంది,
గాలి నీముంగురులతో
ఉయ్యాల లూగుతోంది,
ఎండ మెరుపు
నీ పయ్యెదలోకి జారుతోంది
నీ చెక్కిళ్ళ నించి !

౬

చూడు,
నీ ఆగమానికై
గహనలక్ష్మి అలంకరించుకుంది,
తలపై కొమ్మలోంచి పొన్నపూలు
తొంగిచూస్తున్నాయి నిన్ను-
ఎవరా ? అని

నీ పాదస్పర్శతో శాద్వలం
ఆనందం అణుచుకోలేక
తెల్లని పువ్వునవ్వులుగా
విరుచుకు పడుతోంది
రాళ్లని తాకి ఎగురుతోంది
ఏటినీరు
నీముఖాన్నందుకోవాలని

తనధవళ పుష్పాల నిగనిగలతో
అప్పడికి
హారతిస్తోంది
దత్తూర

౨

మొన్న ఇంకా పక్కపైన
కలలు కంటున్నాను
ఉషస్సింకా బెదిరిచూస్తోంది
ఈ ధరణీ తిమిర కల్మషంలోకి
దిగిరానా-వొద్దా ? అని

అరుణాచలశిఖరంనించి
ఓ దివ్యవాణి విన్నాను
ఆ సమయాన.

కళ్లిప్పి చూసే గడ్డిపువ్వుకి
పువ్వునించి దూకే మధుపానికి
గడ్డికొరికి గెంతే మేకపిల్లకి
పరిమళంలో మత్తెక్కితూలే పిల్లగాలికి
రెక్కలు జాచి దూసుకుపోయె శారికకి

చేతులు జాచి నవ్వే పసిపిల్లకి
పనిలేక పరిగెత్తే కుక్కకి
కుక్కని చూసి నవ్వే ఉన్మత్తుడికి

ఈ ఉజ్వల ప్రభాతాన
స్వాగతం!
అన్నది ఆ వాణి.

౮

ఈ వెలుగులో
లోకమంతా
పువ్వులు వికసించాయి !

యుగయుగాలుగా ఆకాశాన్నించి ఏకధారగా
వర్షించే ఈ తేజస్సుకి తన రేకుల్ని విప్పిన
ఒక్క హృదయ ద్రుమమైనా వుందా లోకంలో?
అని అడిగింది ఆ ఆకాశవాణి

భూలోక వాసులారా
నిత్య పథికులారా
నవజీవనోన్ముఖులారా,

మీ హృదయ పాత్రల్ని
ఈ దివ్య తేజో మధువుతో
నింపుకోండి
అని అర్థించింది !

౯

దిక్కునించి దిక్కుకి
    ప్రతిధ్వనించిన ప్రభాతవాణి
        కార్య నిమగ్నులైన జనులలో సైతం
            ఎక్కడో రక్తం అడుగున పలికింది
                జన్మజన్మాంతర నిగూఢ
                    అవ్యక్తస్మృతులుగా...

వినీల సముద్రతరంగ ప్రక్షాళిత
    ద్వీపాంచలాలమెరిసే
        అరణ్యపార్శ్వ పుష్పశోభిత శాద్వలం
పర్వత ఝరుల నిర్మలగానం
నదీ తటాల పవిత్ర స్నానం
శిశు స్వచ్ఛ మానసోల్లాస
    విస్ఫురిత అమాయికహాసం
అర్ధజ్ఞాత స్వప్న సుందర విహారం .
హృదయాంతరాళ బహిర్గతానర్గళానందం——

ఎక్కడో,
ఏ ఆత్మాంతరాళంలోనో
ఒక్క నిమిషం తళుక్కుమన్నాయో, లేదో
అంతే!

తరవాత–
ఎప్పటి చీకటి పొరలు
మనసులపై
చీకు ఆలోచనలు
చిక్కు వ్యవహారాలు!

౧౦

చరాచర ప్రపంచాన్ని
సహస్రకరాల ఆలింగనంతో
దేదీప్యమానంగా హత్తుకునే
హిరణ్యగర్భుడి అవ్యాజ మిత్రత్వాన్ని
హర్షించిన హృదయమొక్కటి లేదు

హృదయాలలోని వెలుగు
ఏ నేత్రాలకీ మెరుపునియ్యలేదు
జీవిత సౌభాగ్య మాధుర్యం
ఒక్కరి వాక్కులో ధ్వనించలేదు

చుట్టూ నృత్యంచేసే ద్యుతిని
భరించలేని చూపులతో
ఆశాబంధుర బంధాల్లోకి
అనవసరాలోచనాంతర మర్మాల్లోకి
ఆర్జనావసర తిమిరాల్లోకి
దూరుతున్నారు

౧౧

చూడు

నీడలు మెల్లిగా శిలలకిందికి
పాకుతున్నాయి
పాములమల్లే.

శీతల పవనాంగుళీయాల
చక్కిలిగింతలకి ఈకలు రేగి
కొమ్మల్లో పక్షులు కిచకిచ మంటున్నాయి
నెత్తిమీది చెట్టు చీకట్లలో
కూర్చున్న పావురాల మూలుగు
నిద్రని కళ్ళమీదికి లాగుతోంది
అరుణాచల శిఖరాభిషేక
జలప్రక్షాళితమైన
నీ పాదాలతో
ఆడుకుంటున్నాయి
ఏటిచారలు.

౧౨

ఈ నికృష్టలోకంపై హృదయం ద్రవించి
ఎందరు మహనీయులు
ఎన్ని మతాలు బోధించారో
ఎన్ని జ్ఞాన మార్గాల్ని విశదీకరించారో
ఎన్ని సాధనలు ఉపదేశించారో
ఎప్పుడూ కాంతివేపు కన్ను తెరవాలని రెప్పలెత్తే
ఈ అర్ధాంధులకు, ఈ ప్రజకోసం !

౧౩

ప్రవక్త
తరవాత
ప్రవక్త
జ్ఞాని వెంట జ్ఞాని
అవతారం వెనక అవతారం
ఈ రొంపిలోకి దిగి వొచ్చి
ఘోషించారు, పాడారు
ఋక్కుల్ని వినిపించారు
లాలించి వెలుగుని వెదచల్లారు !

౧౪

మత్తులోనించి మేల్కొనమని తట్టారని
తమక్షుద్ర ఇంద్రియ లోపత్వాన్ని తిట్టారని
కాంతికి మూసుకునే కంటిరెప్పల్ని విప్పచూశారని
దౌర్జన్యాన్ని వ్యభిచారాన్ని నిరసించారని
ఆచరణాధికమైన ధర్మాన్ని, దుష్కరమైన నీతుల్ని
బోధించి తమని లోకువ చేశారని
తమ అధికారాలకి, ఘనతలకి, హక్కులకి
విఘాతం కల్పించారని
మృత్యువని, నరకమని
దైవాగ్రహమని తమని భయపెట్టారని—

ఆ దివ్య సందేశహరుల్ని రాళ్ళుకొట్టి హింసించారు
శిలువలువేసి వెక్కిరించారు, అపవాదులువేసి తరిమారు
కైదుల్లో బంధించి నోళ్ళుమూసారు, కళ్ళు పీకించారు!

౧౫

దుఃఖితులారా, రండి
మీ ఆర్తినార్పుతాము
దీనులారా, కుంగిపోకండి
మీరు ధన్యులు
బీదలారా, సాధులారా, రోదించకండి
స్వర్గరాజ్యం మీది
గర్వాంధులారా, పరహింసా ఉన్మత్తులారా.
ఐశ్వర్య పదవీ వ్యామోహ పాషాణ హృదయులారా
దైవమున్నాడని మరువకండి
అని
పర్వతాగ్రాల, పురరాజ వీధుల
అరణ్యాశ్రమ పరిసరాల
సహస్రకంఠాలతో అరిచిన ప్రవక్తలేమైనారు?
రక్తాన్ని సుఖాన్ని ప్రాణాన్ని అర్పించి
కాలానికి అధికారానికెదురీదిన
కరుణాత్ములు!

౧౬.

ఎందరు యోగులు
దివ్యసందేశం పెదవులపై
వాక్కులో అమృతం
నేత్రాలలో అగ్ని
హృదయంలో వార్ధి గంభీరత్వాన్ని దాల్చి
వరసగా
దిగి వొచ్చారో
దీన జనోద్ధరణకై!

౧౭

అమర జ్ఞానాన్ని
వేణువులోంచి జగన్మోహన గానంగా
వినిపించిన శ్రీకృష్ణుడు
శాంతమయ దరహాసంతో
దుఃఖాన్ని ఆర్పిన బుద్ధుడు
తన స్వంత రక్తంతో
ప్రజల పాపాన్ని పరిహారం చేస్తానని
బతిమాలి దిగివొచ్చిన జీసస్
తలనరికి
హృదయంలోకి తొంగిచూసిన మహమ్మద్

వాళ్లందరీనాడు
మతాలలో కలహాలలో కవిత్వాలలో గొప్పతనాలలో
వుత్తి పేర్లు!

౧౮

అహింసా స్తిమిత సుహృత్తులో
    ద్వేషాన్నార్ప చూసిన గాంధి
అమృత గానంతో
    మర్త్య హృదయకవాటాన్ని తట్టిన రవి
మౌనంతో జ్ఞానాన్ని పంచిన
    సాక్షాత్ దక్షిణామూర్తి రమణ

వొచ్చిపోయిన
    జాడన్నా కనిపించదీనాడు
        లోకంలో !

౧౯

ఈ మట్టి అంతా ప్రతీ అణువూ
సాంరాజ్యమని, దేశాభిమానమని
మతప్రచారమని, సత్యప్రతిష్ఠాపనమని
పగ అని, ప్రేమ అని
త్యాగించినవారి రక్తంతో
తడిసిఎండింది

బాధలోంచి నడిచి
అగ్నిలో ఆహుతై
తాము లోకానికిచ్చిందేమిటి ?
తాము పొందిందేమిటి ?

౨౦

చిన్నతనంలో నేనూ తిరిగాను
మతమని, యోగమని
సయన్టిస్టులని, పండితులని

కాని ఎటువెళ్లినా చివరికి
తెలుసునన్న వారికి
తెలీదని తెలుసుకుని
తిరిగివొచ్చాను

చెప్పేవారే గాని
చూపగలిగిన వారెవరూ లేరు!

౨౧

లోకం సత్యం, లోకమసత్యం
ఇదంతా అణువు, ఇదంతా శక్తి
జన్మలున్నాయి, జన్మలు లేవు
మానవుడు ముఖ్యం, మానవత్వం శాశ్వతం

ఇట్లా వాదించుకుంటూనే
బోధించుకుంటూనే
వెళ్లిపోతున్నారు
దిక్కు లేకుండా !

## ౨౨.

దేవుడున్నాడు, దేవుడు లేడు
అంతా మనప్రజ్ఞ
జన్మని సాధిస్తాం, మృత్యువునరికడతాం
అంటోనే
మృత్యువులో మాయమైనారు
శిష్యుల్ని అట్లానే వొదిలి!

౨3

లోకాన్ని సుఖపెడతాం
బాధని తీసేస్తాం
అంటూ
తమకిసుఖాన్ని పోగుచేసుకుని
అనుభవించలేక
గింజుకు చచ్చారు
ఎందరో మేధావులు!

౨౪

ఎందుకొచ్చాం
ఎట్లావొచ్చాం
ఎక్కణ్నించి వొచ్చాం
ఎక్కడికి పోతాం
అసలు ఎట్లావున్నాం
ఎట్లా కలిశాం
ఏదిసుఖం, ఏదిబాధ
ఏది ధర్మం
ఎవరు చెపుతారు ?

నీకు తెలుసా
నాకు తెలుసా
తెలుసన్న వాడికి తెలుసా
ఎట్లా తెలుసు ?

౨౫

ఎందుకు సుఖపడలేడు మానవుడు
శక్యం కాని మలినమెట్లా పట్టింది
ఎందుకు తెలీదు ? ఎందుకు చాతకాదు ?
ఎంతకీ ఇంతేనా బతుకు
ఎవర్ని ప్రశ్నించను ?
ఎవర్ని ధిక్కరించను ?

౨౬

మానవుడి అవ్యక్త వ్యథ
అర్థంలేని స్వప్నాలు
ఎన్నటికీ సాధ్యపడని ఆశలు
చేరరాని ఆశయాలు
తృప్తిపడని మోహార్తి
నిరంతరాన్వేషణ :
దీని కర్థం చెప్పిన వారెవరు ?

౨౮

ముక్కు చెవులు మూసుకో
    మౌనంపట్టు
కళ్లుమియ్యి
    వూపిరాపు
రాళ్లమీద పూలురాల్చు
    పరమతస్తుల్ని కాల్చు
కొండ నెక్కి కూచో
    నదుల్లోదిగి మునుగు
ఏకాంతంలో నిలు
    తీర్థాలన్నీ తిరుగు
తిండి మానేయ్
    సంతర్పణలు చేయ్
లోకాన్ని వాదులు
    లోకాల్ని మింగు

ఇట్లా అంతంలేని
    గ్రంథాలు బోధలు
        శాస్త్రాలు మతాలు !

౨౮

హృదయాన్ని కఠినం చేసుకుని నిర్దయులై
స్వసౌఖ్యమే పరమావధిగా విర్రవీగి
దీనుల్ని దోచుకునే దుష్టులు ధూర్తులు—
విశ్రాంతి నెరగని వారి యెగశ్వాస విను!

దేహేంద్రియాలు తప్ప తామింకేం కాదని
పెంచుకున్న తమకొవ్వులో వూపిరాడక
గింజుకునే దౌర్భాగ్యులవంక చూడు!

సుధ

౧౯

ఎక్కడ వెలుగుచూడాల్సివొస్తుందో
ఏ బోధవిని లోకంపై తమవేళ్లు
పట్టువాదులుతాయోనన్నే భయంతో
కళ్లుకిందికివాల్చి పక్కచూపులతో
ఏ మెరగనట్టు జంకుతో
వాళ్లు ముడుచుకొని
ఆకాశాన్నించి దాక్కుంటో
ఎట్లా పోతున్నారో !

౩౦

అహాన్ని పెంచుకొని
తమకన్న సమర్థులు జ్ఞానులు
శక్తిమంతులు లేరని
కళ్లు కానక
అధికారమదం బలిసి
ఇనపగిట్టలతో
దీనమృదుల హృదయ
పల్లవాల్ని తొక్కుకుంటూ పోయే
ఈ కణుజుల్ని
కాలగుహాంతరాళంలోంచి
పొంచి వెంబడించే
మరణవ్యాఘ్రమదుగో.

3౧

తమ వేగంతో
కాలాన్ని ఆపాలని
అరుపులతో
లోపలి పిలుపును నొక్కెయ్యాలని
పనుల తొందరలో
తమ నిస్సహాయత్వాన్నించి
హీనత్వాన్నించి తప్పించుకోవాలని
ఎక్కడ ఎప్పుడు
తాము తమ ఆత్మల ఎదట
వొంటరిగా నుంచోవలసివొస్తుందోనని
ఎట్లా గాలిలోంచి
దూసుకుపోవాలని
చూస్తున్నారో !

3_౧

ఈ నాడు లేనిదేదో
రేపు దొరకబోతోందని
ఈ నిమిషాన్ని వొదులుకుని

ఏ నాటికీ రాని ఆ రేపుకోసం
దేవుళ్ళాడే ఈ దీనుల ఆర్తికి
దిక్కెవరు ?

33

చెలీ, ఏమిటీ ప్రపంచం!

పక్కకి జరిగే మబ్బుల్లో
    మాయమయ్యే వెలుగు
నీ పెదిమల్లోంచి జారి
    కపోలానికి పాకే చిరునవ్వు
ఓ నిమిషం ఓ మెరుపు
    మరుక్షణం మరుపు!

చీకటి, అంతులేని చీకటి
    ఏ కాంతిరేఖా అటు తొంగి చూడని
        చీకటి!

38

నిన్న రాత్రి పక్కమీద రాలిన
జాజిపూలని తలుచుకోకు,
ఇంక ఆ రాత్రి లేదు,
ఎంతటి జ్ఞాపకాలూ
- నీ పెదవుల్ని మోహంతో
మధురం చెయ్యలేవు !

రేపా !
ఎన్ని రేపులు నిన్నలైనాయి,
మన ఆశలూ, ఆలోచనలూ
ఒక్క రేపుని మన ఇష్టానికి
అనుగుణంగా మార్చగలిగాయా ?

3. శ్రీ

ఈ అనంతకాలమనేదే ఒక్క—క్షణం,
ఆ క్షణికమైన కాలంలో
ఒక్క—క్షణం మన బతుకు

నువ్వు – నేననే ఈ జ్ఞానం,
అంతే మరుక్షణం
నువ్వు లేవు నేను లేను

ఆ లేకండా పోయిందేదో
ఎన్నటికీ తిరిగి రాదు !

సు.ధ

3౬

గడిచిన అనంతంలో
    మౌనం లేము
గడవబోయే అనంతలో
    వుండబోము
ఈ అగాధ ఆద్యంత రహిత శూన్యంలో
    ఒక్క-క్షణం
        ఈ నేననే వెలుగు!

38

చూడు!
కదలక రోదించే
ఈనికృష్టజీవుల్ని
ఎట్లా
మెడపట్టి గెంటుతోందో
నిరంకుశకూరవిధి
రక్తారుణ
మృత్యుదంష్ట్రా
భీకర గహ్వారంలోకి

పచ్చికలోని నీలం పువ్వులపై
మెరిసే మంచు బొట్లు
ఆకాశాన అగాధాన్ని వెలిగించే నక్షత్రాలు
పోతున్నాయి అనివార్యంగా
కొట్టుకు పోతున్నాయి!

నీ ముఖాన్ని నాలోకి తీసుకుంటున్న
ఈ క్షణాలు
విశ్వమంతా వెతికినా
మనకి తిరిగి దొరకవు.

## 30

రూపాలు, అందాలు, ఆశలు,
ప్రేమలు, కన్నీళ్లు, అన్నీ
ప్రాదుర్భవించుకుపోతున్నాయి
వడిగాపరిగెత్తే
కాలప్రవాహంలో
ఏ శూన్యమహార్ణవంలో
మాయంకావడానికో!

౩౮

తెంచుతోంది
వేళ్లతో సహా
పెళ్లగించి లాగేస్తోంది
రాజ్యాల్ని వంశాల్ని ఆశయాల్ని
పెనవేసుకున్న చేతుల్ని
నాటుకుపోయిన నమ్మకాల్ని !

౪౦

ఏ ప్రార్థనలూ కన్నీళ్లూ
వేదనలూ నివేదనలూ
నిందలూ స్తుతులూ
ఏవీ కదలించలేవు
దాటుకు పోయే
కఱుకు విధిని!

౪౧

విధికెక్కడా దయలేదు
ప్రేమలు కట్టుకుని
అమరత్వాన్ని ఆశించే
వెర్రిహృదయాల్ని చూసి
ఎంత నవ్వో
కాలానికి!
రక్తంకక్కే ఈ బాధకి ఈక్షోభకి
ఎక్కడా దిక్కు
లేనేలేదా?

౪౧

ఎక్కడో ఏదో
    వుందనే భ్రమలో
        విరిగిన నడుములతో
            కాళ్లీడ్చుకుంటో
భీకరమృత్యువ్యాళ
    అంధకార కంఠబిలంలోకి
        పాకే జీవుల
అంతిమాక్రందనాన్ని
    వింటున్నావా ?

౪౩

చాతకాదని చేతులెత్తే
అనాథల్ని ఆదరించే
ప్రభువే లేడు

ఇదంతా అర్థంలేని
వ్యర్థరోదనేనా!

౪౪

ఉండి,
వ్యర్థుడో
నిస్సహాయుడో
కఠినుడో
కావడంకన్న
లేకపోవడం
నయం కదూ!

౪౫

ప్రేయసీ,
ప్రాణహత్యని అంగీకరించినా
ప్రేమహత్య క్షంతవ్యం కాదు

ఈ ప్రేమ విఘాత దారుణేశ్వరుడొకడుంటే
వ్యథనిమరిచి ఎన్నటికైనా
క్షమించగలదా
జీవకోటి ?

౪౮

విష్ణు సాన్నిధ్యంలో నామ భజనం
కైలాసంలో నిరంతర ధ్యానం
బ్రహ్మచుట్టూ తర్కవినోదం
స్వర్గసీమలో అప్సరసలనాట్యం
అల్లా సాన్నిధ్యంలో ప్యారీల సాంగత్యం
యెహోవా పక్కన ఉన్నతపీఠం

ఆశలు
అంతులేని మిడిమిడి ఆశలు
మిధ్యావిశ్వాసం
మింటిని మింగే మాయాస్వార్థం

వాడికి వొద్దు.
నాకే ఇయ్యి
ఇక్కడ వొద్దు
అక్కడ ఇయ్యి

ఇదీ వరస!

౪౭

ఇదంతా ఈశ్వరేచ్ఛ
క్రౌర్యం, భయం.
చావు, క్షోభ -
ఇవన్నీ ఈశ్వరేచ్ఛ!

తమ సుఖం
అందరి దుఃఖం
తమ ఆధిక్యత
అందరి న్యూనత

ఇదంతా ఈశ్వరేచ్ఛ
అనే ధూర్తులు -
తాము ఈశ్వర రహస్య
మంత్రాంగమందిర
ద్వారపాలకులైనట్టు!

౪౮

ఇదంతా కర్మ
నాది సత్కర్మ
నీది దుష్కర్మ

చేశావు
అనుభవించు
చేసిపైగా
ప్రశ్నలా?
నోరెత్తకు!

౪౯

చేసావా,
ఇంకవిడవదు
ఎక్కడ ఎటుదాగినా
వెంటనంటి వేగిస్తుంది
కర్మచేచిక్కావా,
ఇంక రక్షణలేదు
ఆశ లేదు
ముక్తి లేదు
సుడిగుండంలోపడి
వరసగా
అడుక్కి మునుగుతో
ఓనిమిషం తేలుతో
ఆశతో వ్యర్థంగా
ఆకాశంవేపు చేతులెత్తి
పిలుస్తో

సుధ

పూడ్చిరాడని వ్యథతో
    అనంతంగా కొట్టాడంతప్ప
        దిక్కు లేదు
బతుకంటే
    అర్థం
        అంతే!

౫౦

దిక్కు లేదు, ఆశ లేదు
విని వోదార్చే జాలి లేదు
తప్పించుకునే తోవ లేదు
ఈ
జననమరణ తమోనిర్మిత
పైశాచిక నిర్బంధ పరిభ్రమణానికి.

౫౧

చేసేది చేసి
అడగడానికి అగపడని
ఈక్రూర నిర్దాక్షిణ్య నిరంకుశత్వాన్ని
లోకం అనాదిగా భరిస్తోంది
ఇంక దిక్కులేక.
కత్తిచివర రాసిన తేనెబొట్టును
మహాప్రసాదమని నాక్కున్న
గాయంలోంచి కారే
రక్తాన్ని తాగుతో!

౫౨

ఏ యాత్రి తిరుగు
ఏ గురువుని సేవించు
శాస్త్రాలు వేదాలు చదువు
లోపల చూడు
వెలపల చూడు

కాల విద్యుత్ పరిసరణాలో
మధ్యలో ఎక్కడో ఓ క్షణం
భగ్గుమని ఆరే మనసుకి
ఆద్యంతరహిత సృష్టి మహామర్మం
ఎట్లా వ్యక్తమౌతుంది?

౫౩

ఎవర్నడగను?
ఎవరికి తెలుసు?

ఈశ్వరుడే వుండి,
నాకంట పడనీ
నిలేసి ధిక్కరిస్తాను
ఇదంతా ఏమిటని!

కాని,
ఆ ఈశ్వరుడే
ఎవణ్ణడుగుతావు
ఎవడు నీకు వాగ్దానించాడు
నిన్ను సుఖపెడతానని
నీ సందేహాలు తీరుస్తానని!

అసలు,

నువ్వెవడివిరా

నన్నడగడానికి?

నువ్వూ,

నీబతుకూ,

నీ తెలివీ,

ఎంతటివని!

అంటే,

నేనేమనను?

౫౪

ఇదంతా ఓ తెలియరాని
తెలుసుకోలేని
తెలప సాధ్యంకాని
పరమ నిగూఢ రహస్యం

ఎన్నటికీ ఎరుకపడని దానికోసం
ఏదోవున్నదనీ శ్రమిస్తే వ్యక్తమౌతుందనీ
భ్రమింపించే ఎండమావులకోసం
ఎక్కడికీ తీసుకుపోని వలయంలో
పరిభ్రమించడం అవివేకం
అమూల్య జీవితకాల
వృధావ్యయం!

౫౫

యోచించు,
నీతో మాట్లాడే 'నేను' ఎవరు?
వినే 'నువ్వు' ఎవరు?

మనిద్దరిమధ్యా మనని వేరుచేసే
ఈలోక మెవరు ?
ఈ కళ్లలోంచి నిన్నునన్ను కలిపి చూసే
కాంతి ఎవరు?

నామాటల్ని లోపలికి తీసుకునే
శ్రోత ఎవరు?
వీటన్నిటివెనకా నుంచుని
అనుభవిస్తున్నానని భ్రమింపచేసే
జ్ఞానమెవరు?

౫౬

అలిసి
నా రొమ్ముమీద తలని ఆనించి
నిద్రించే నీకు ప్రపంచమేది,
నక్షత్రాలేవి,
నేనేది,
నువ్వేది?

చీకట్లో
నీకళ్ళలోకి చూసే
నాదృష్టికి దూరమై
మూతలు పడ్డ నీకళ్ళ వెనక
'నువ్వు' ఎక్కడున్నావు?

ప్రియా! అనే నామృదువైన పిలుపుని విని
మేల్కొనే నీమనసు
ఆలోకవార్తలొక్కటైనా చెప్పదు
ఏమయింది
అంతసేపు!

౫౭

స్తిమితపడి కళ్లుమూసే
మన తలలు అంత సమీపంలో
ఏకమై శయనించినా
నీ ఆలోచనలకీ
నా ఆలోచనలకీ
ఎన్ని సముద్రాల
అనుల్లంఘనీయ
వ్యత్యాసమో!

సుధ

# గిర

మోహోద్రేకం
ఏకముఖమై శ్వాస ఆగి
మనోనిర్మిత అవధుల్ని దాటి
శాంతిలో ఆగిపోయినప్పుడు

ఆక్షణాన
నువ్వు లేవు నేను లేను
నువ్వు నేననే భేదమే లేదు
మనకి లోకమే లేదు

## ౫౯

అనంతత్వ గర్భం లోంచి
కాలం కదిలినప్పుడు
ఏమాయాతీరాన విజ్ఞాన తరంగం
చింది ఎగిరిందో
ఆకాశాన ఇన్ని వెలుగుతుంపరలై
మెరిసింది ...

౬౦

ఇదంతా ఒకటే జ్ఞానం!

రానిస్తారో లేదో అన్నట్టు
భయపడుతో తొంగిచూసే
ఉషస్సే
వొదలలేక వొదలలేక
ఒక్కొక్క తేజాంగుళినే
వెనక్కితీసుకుని
పడమటు అదృశ్యమౌతుంది!

ధాత్రిపై క్రూరంగా
మహోద్రేకంతో విరుచుకుపడే
చండకిరణుడే
అర్ధరాత్రి ఆకాశాన్ని
చిన్న చిన్న మెరుపు ముద్దులతో
చక్కిలిగింతలు పెడతాడు!

౬౧

కళ్లులేని గురివింద తీగెకి
పట్టుకొమ్మ దారి కేందుకు
కస్తూరి పూలపరిమళం తోవచూపిందా?

తన పూలగర్భాల్లోకి దూరి
మకరందాన్ని తాగే తేటి రొమ్ముకొంత
తంగేటిచెట్టుకి ఎన్నడో తెలుసా?

నడి ఎండలో చేతులు జాచి
నాట్యంచేసే కొబ్బరిచెట్టుకి
తన ఎత్తునించి వ్రాలిపడే పాపని కాపాడ్డానికి
పీచుదిళ్ల చొక్కాలల్లడం ఎవరు నేర్పారు?

గర్భంలోని శిశువులో
ఏ అవయవాలు ఎక్కడ ఏర్పడాలో
కన్నతల్లి కలగన్నదా?

సుధ

వార్ధి గడ్డకట్టినా
మంచు బరువెక్కకుండా
తన జీవనంకోసం
సృష్టిజలసూత్రాన్నే మార్చింది
చాపేనా!

౬౧

చండభానుడి దుర్భర తేజస్సుని తాగి
చుక్కలుగా చెమర్చే గగనాకాశం
యోగి మనసుని మింగి
ఆనందనృత్యంచేసే హృదయాకాశం
మిణుగుర్లని వెలుగుపువ్వులుగా తలలోధరించే
వృక్ష సౌందర్య పిపాస
హృదయంలోని ప్రేమకి
గర్భంలో రూపమిచ్చుకునే తల్లిప్రియాస
పక్కనున్న ధాత్రిని పైనున్న గగనాన్ని
ఏకంచేసి నవ్వాలనే కడలికాంక్ష

ఇదంతా ఒకటే జ్ఞానం, ఒకటే వెలుగై
అణుచుకోలేని ఆవేశంతో
చిందులు తొక్కుతోంది!

౬3

దినమణి ద్యుతులతో
ధగధగాయమానాగ్ని గుండమై
మండిన కాసారం
విశ్వామిత్ర కోపాగ్నివలె శమించి
నీలాకాశ నీరవంలో
నీరదచ్ఛాయా స్వప్నాలు కంటోంది.

నీడలు కదులుతున్నాయి
కాంతి వేడెక్కుతోంది
నవప్రాతః ప్రసూనాల నృత్యానికి
వాడిన రాత్రిపూలు వేళ్లాడే తలలతో
తాళం వేస్తున్నాయి

౬౪

తృణ వృక్ష పత్రాలపై చెదిరిన
హిమ కణ బింబాలతో
వివిధ వర్ణ శోభితుడై
భిన్నత్వంలో క్రీడించిన
సూర్య భగవాన్

ప్రళయోన్ముఖుడై
తనవిభిన్న ప్రతిరూపాల్ని
ఉపసంహరించుకున్నాడు

శ్యామల శాద్వలమై పులకరించిన
బాలసూర్యప్రభా
చర్చిత ధరణీతల సౌకుమార్యం
ప్రౌఢ సవిత్రాలింగ నోష్ణ
తీవ్రతని భరించలేక
శోషిల్లింది!

## ౬౫

ఈ జ్ఞానోద్రేకం కన్నీళ్ళ నెరగదు!

ఉష్ణరుధిరం తాగేపులి గాండ్రింపులో కంపిల్లే లేడికి
వ్యర్థంగా వేగమిచ్చిన కృప కన్ను చెమ్మగిల్లదు,
'తేనె పిట్ట రెక్కలపై ఆప్యాయంగా రంగులుపూసిన ప్రేమ
చీల్చుకుతినే డేగవాడి ముక్కు రుచిలో మూర్ఛలుపోతుంది,
మృత్యుగ్రస్తశిశు అసహాయ ఆర్తనాదంతో గిలగిలలాడే
తల్లిహృదయానికి ఊరటగా సృష్టినించి
ఒక్క అశ్రువైనా రాలదు!

౬౭

రాత్రంతా మేలుకుని
ప్రతిగడ్డిపరకకి రంగులదీపాల
నలంకరించిన రంగవల్లిని
వనదేవత ఉదయానే
అమిత వైరాగ్యంతో
ఆవు కరుకునాలిక కందిస్తుంది.

౬౭

సృష్టిహృదయ భావోద్రేక
విలాస విజృంభణలో
కారుణ్యానికి చోటులేదు

దినదిన క్షణక్షణ ప్రళయనృత్య పాదఘట్టనలో
ఎన్నిప్రాణాలు, ఎన్ని ప్రణయాలు
తెగి నశిస్తున్నాయో లెక్కలేదు
ఈ కాళికాలయంలో
నిమిష నిమిషం
లక్షప్రాణుల మహానైవేద్యం.

విడిపడే ప్రియుల తపన
నొప్పులుపడే తల్లి వేదన
పాలుతాగే పిల్లమమత
ప్రాణావసాన జీవుల భయవిహ్వలత:
అన్నీ, ఆమె మహానాట్యంలో
ఛిద్ర భంగిమలు
చిద్విలాసాలు!

౬౮

ఎట్లా నమ్మను
కృపా ప్రేమా
లోకాన్ని పరిపాలిస్తున్నాయని!

శతసహస్రభాను సదృశ దివ్యజ్యోతి
అల్పమానవ మనోహంకార తిమిరాన్ని
వెలిగించ లేకపోయిందా?

అనంత విశాల వినిర్మల జ్ఞాన వార్ధిలో
ఈసంకుచిత మూఢ తిమింగలాలు
నిస్సహాయ మృదు మీన మాంసాలు తినిబలిసి
తిరగవలసిందేనా?

అప్రతిహత నిరంతరాకర్షణా
విజృంభమాన ప్రేమతరంగాలు
యుగయుగాలుగా కఠినకర్కశ హృదయపాషాణాలపై
వ్యర్థంగా తగిలి విరిగి చింది
కన్నీటి ధారలై కారవలసిందేనా?

౬౯

కృపావహితమైన లోకంలో
ఈ బానిస బతుకు దుర్భరం

ఇదంతా దేనికో తెలీదు
ఎందుకు జన్మించామో
ఎట్లా ఈ వ్యూహంలోపడ్డామో కాని,
ముక్తి లేదు

ఎన్ని యుగాలు గడవనీ, జన్మలెత్తుతో
అంతులేని ఆశలతో, కరిచే కోర్కెలతో
వదలని అల్పత్వంలో ఇంతే
ఇట్లా కొట్లాడ వలసిందే

మరణమా! ఏం చేస్తుంది
ఏమిస్తుంది మరణం?
అలిసిన దేహాన్నే కాని
మండేమనసుని మంటపెట్టని మరణం!

౭౦

రక్షకుడు, జ్ఞానధాత,
చాచిన చేతినందుకునే
కృపాళువు లేడా!
అని
ఏడుస్తో కళ్ళు మూసాను
నా కళ్లలో నివసించు
నా వాక్కులో శాంతించు
నా హృదయంలో శయనించు
నా ప్రేమలో మరణాన్ని శాసించు
అంటూ
నిద్రలోనైనా నన్ను విడవని
నీ చేతుల్లో
నిద్రించాను!

౭౧

ఆ రాత్రి కలవొచ్చింది:

దేదీప్యమానమైన తెల్లని మంటల్లోంచి
ఎర్రని ఆకారాలు లేస్తున్నాయి
హోమంలో పడే ఆజ్యంవలె
పచ్చని సమిధలవలె
ఓ నిమిషం భగ్గుమనివెలిగి తెల్లనై
జ్వాలలో కలసిపోతున్నాయి
సాంరాజ్యాలు, విప్లవాలు
యుగాలు, ప్రళయాలు
రవ్వలవలె పైకెగిరి
క్రొంచెందూరం పయనించి
భస్మమై ఐక్యమవుతున్నాయి
ఆ హోమ ధవళజ్వాలలో!

౭౧

నేను! నేను!
ఏది నేను? ఎక్కడ?
ఈ విశ్వహోమజ్వాలలో నేను లేనా?
అనుకుంటూ వుండగానే—
నేనున్నాను!
నువ్వూ?
నువ్వూ వున్నావు
వున్నాం ఓ మూల
నీ చేతివేలిని పట్టుకుని
నేను
పరస్పర మమకార బంధంలో
కాలానికి ప్రాధేయపడి
నుంచుని వున్నాం
ఓ క్షణం
మరుక్షణం
అనివార్యంగా జ్వాలల్లోపడి
దేహబంధాలు మమకారాలు మండి
ఏకమై మాయమైనాము!

౭౩

కళ్లు తెరిచేప్పటికి
    మొదటి జ్ఞాపకం
        నేను!
ఆ 'నేను' చుట్టూ పాకాయి
    కందిరీగల మల్లే కుడుతో
        ఒక్కొక్కటే జ్ఞాపకాలు!

మనసు పని ప్రారంభించింది!

నిర్మల శరదాకాశంపైకి
    తూర్పునించి లేచే గాఢశ్యామల మేఘాల మల్లే
        నాకాకారమిచ్చి తెరకట్టాయి
            భూలోక కషాయ ధూమాలు

పూపిరాడదు!

పోతోంది...
  చెదిరి
    దూరమౌతోంది
      కల
కలతో
  దూరమౌతో పోతోంది
    ఆనందం

మిగిలింది...
  బరువై,
    ఊపిరాడనియ్యని
      'నేను'

## ౭౪

ఏ కుమారశాపంవల్లనో
కల్మషంలో జారిపడ్డ నలకూబరుడివలె
విచారగ్రస్త విస్మయంతో చూశాను
ఈ లోకంవంక
నా చేతిమీద చెక్కిలినానించి
నిద్రించే నీవంక!

ఒక్కపెట్టున ఆపుకోలేని రోదనం
బైలుదేరింది నాలోంచి
చిక్కుకున్నా నా
నాతో నన్నీడ్చుకుంటో
మళ్లీ మనోమోహవ్యూహంలో!

రాత్రింతా
లోకాలన్నీ మనవిగా క్రీడించి
ఆనందంలో అణిగిపోయిన మనం
మళ్లీ మేలుకున్నామా
ఈ గదిలో
ఈ దేహంలో
ఈ పక్కపైన!

౭౫

ఈశ్వరా!
    ఇంతేనా బతుకు

నువ్వు వినవా
    నీకు వినపడేదా
        విన్నా అర్థంకాదా!
నీకూ అసాధ్యమా...
    అసలేమీ లేదా?

భరించలేను!

నిలవలేను!!

౭౬

పక్క మీదనించి లేవపోయి
నీచేతిని నానించి తప్పించపోయి
నీవంక చూశాను
ఆనుకోడానికి తోవచూపడానికి
ఉద్ధరించడానికి నేనున్నాననే విశ్వాసంతో
ఏసమస్యలూ లేక హాయిగా
నిద్రించే నీవంక

ఈ నిర్భాగ్యుడే మివ్వగలడు?
ఈ శాపోపహతుడు
భవరోగ గ్రాహగ్రస్త నీరసుడు

సిగ్గుతో
కుంగిపోయినాను!

సుధ

నీమీది నా వ్యామోహం
నాపైన నీ ఆలంబనం
నా అసహాయత్వం
మనమధ్య బలీయ బంధం

ఇది తెగితేనేగాని
నాకు విముక్తి లేదు
ముక్తి నీకు లేదు
వెళ్లిపోతున్నాను!

౭౭

లేవబోయి
కదిలే నాభుజంమీాది
నీవేళ్లు బిగుసుకున్నాయి
తుపానుకవ్రాగే శిలచుట్టూ
చెట్టువేళ్లవలె

నేను నీమీాదికి
వాలగబోతున్నాననుకుని
నిద్రించే నీమనసు
చిన్నగా పెదిమలపైన పులకరించింది!
నీ తల్లోని జాజిపువ్వులు
పోవొద్దని
పరిమళాలతో ప్రాధేయపడ్డాయి

౭౮

నీ కేమిటీ యాతన ?

స్వకీయకాంతా పరిష్వంగ భాగ్యం కన్న
ఏ ఉద్యత్ స్వర్గాన్ని సాధించబోతున్నావు
అరుణ పల్లవాధర చంచత్
స్మేరపరిమళిత మకరంద పానంకన్న
ఏ ఆనందానుభవాన్ని
ఏ ఆధ్యాత్మికమిలన మిస్తుంది?

ప్రేమించే హృదయాన్ని హింసించి
ఉన్నది వొదిలి
లేనిదేదో వొరుగుతుందని
అడియాసపడే అవివేకిపై
ఏ దేవతలు కరుణిస్తారు?

### ౭౯

నువ్వు
　　బుద్ధుడివా?

నలుడివేమో!

౧౦

ఏమైనా
　　ఈ అగ్నిని భరించలేను!

నా కింక శాంతి లేదు
　　నాకళ్లని కట్టేసి
　　　　నానిశ్చయాన్ని అదిమే
　　　　　　ఆవక్షోగ్రాల
　　　　　　　　నాకింక సుషుప్తి లేదు

తరుణీ!
　　పోనీ
నన్ను!

రాగ

పిలుపు!

అరుణాచలంనించి
అనుల్లంఘనీయాహ్వానం!

వెనక్కి తిరిగిచూడక
పరిగెత్తాను!

## రాత్రి

పరిగెత్తాను
    ఎటుపోతున్నానో తెలీకండా

పరిగెత్తాను
    పర్వతంపైకి అంధకారంలోకి

దొర్లే రాళ్లు
    తగిలే చెట్లు
        చీల్చేముళ్లు
            తప్పుకునే సర్పాలు

నా ఎదట అనంతాగాధం
    ఆగాను.

ర 3

అరుణాచలా
ఘనీ భవానంద తరంగా
అంధకార తేజో మూర్తి
అపాంగ వీక్షణా శమితభవార్తీ.
సకలకలుషబంధనమండన శిఖరజ్యోతీ
చంచత్ మృదు ధవళ మేఘోత్తరీయా
శివా,
ప్రసీదమమ!

౧౪

నా ఎదురుగా
    ఆకాశాన్నంటే తేజోచ్ఛాయ
        నలుపుకి మెరుపునిచ్చే
            అంధకారాకారం

ఆదరంగా గంభీరంగా
    ఓ కంఠస్వరం—
        'ఎవరునువ్వు?' అని

౧౫

"నేను......"

"అవును. ఆ నే నెవరు?"

"నేనా?......నేను......"

దృష్టి అంతర్ముఖమయింది

"నేననే దెవరు?"

అవును. ఈ నేననే దెవరు?

●

౮౬

అవును భగవాన్
నేనెవరు ?

ఎవరు నేను
ఎవరని చెప్పను
నేనని ప్రత్యేకంగా
గూడుకట్టుకున్న ఈ 'నే' నెవరు?

లోకమంతా చిందులుతొక్కే కాంతినించి
జననమరణ తరంగాలై విరుచుకుపడే
అంతరహిత ప్రాణ స్పందనం నించి
సుఖదుఖ్ఖడోలికల్లో వూగే
మానవహృదయానుభూతినించి
పరిధులులేని అనంతాకాశ విశాలత్వంనించి
వేరై విముక్తికై రెక్కలు కొట్టుకునే
ఈ నేనెవరు ?
అవును, 'నేను' అనేదెవరు ?

౮౨

సృష్టికి పూర్వం నేనెవరు
సృష్టి అనంతరం మిగిలేదెవరు
సర్వకాల సర్వావస్థల్లో చెదరక
మారకనిలిచి చూచే ఈ జ్ఞానమెవరు
సుఖదుఃఖాశ్రువుల్లో కరగక
ప్రతిఫలించే కాంతి ఎవరు?

'నేను' అనే దెవరు
ఆ 'నేను' వున్నదని
తెలుసుకునే దెవరు?

ఎవరు? ఎవరు? ఎవరు?

## రా

ఆకాశాన్నంటే ఆ గభీరశ్యామలాకృతి
నాపై దృష్టి నిలిపింది
ఇనుమును చీల్చే విపరీతాగ్ని కీలవలె
పాషాణాల్ని కరిగించే కేంద్రీకృత సూర్యరశ్మివలె
ఆ తేజోమయ వీక్షణం బ్రహ్మాస్త్రంవలె
నాలోపలి అంధకారంలో ప్రవేశించి
సమస్తబంధాల్ని ఛేదిస్తూ
అంతరాళంలోకి దూకి
భగ్గుమని మండింది!

నేను లేను!

## ౮౯

నేను లేను
    నేను భావించుకుంటున్న దేదీ లేదు

శూన్యం నాలో
    ఆనందబంధుర శూన్యం
నా వెలపల
    తేజోమయ శూన్యం

లోపలా బైటా
    అంతటా శూన్యం !

౯౦

కళ్లిప్పేప్పటికి
నువ్వూ, గదీ, ఎండా
చూస్తో నేను

ఈశ్వరా.
వొదిలావా
నా చేతిని

మళ్లీ
ఈ మాయలో
పడ్డాను!

౯౧

"రోదించకు!
ఇదంతా ఏంలేదు
వాస్తవం లేనికల
ఈ కలగనేదెవరు?"
అని నాహృదయ్యాంతరాళంలోంచి
విన్నానో లేదో—

నువ్వు లేవు గది లేదు
నేను లేను లోకం లేదు
అంతటా 'నేను నే' ననే
ఆనంద తరంగాలు!

## నా

నాలో నేను చిత్రించుకున్న
కాలమూ దూరమూ లేనిపటం
నువ్వూ, నేనూ, గదీ, ఎండా
అందం, ఆకాశం, అంతా
నాలోని చిదాకాశం
అంతటా నేను

నా హృదయంలోని తేజస్సు
మనోదర్పణ కోణాలలో
చీలికలై రంగులై చింది
ప్రపంచంగా రూపొందింది!

అంతే,
ఇంకా నిద్రపోతున్న అంధకారాన్ని
కళ్ళిప్పమని ఉషస్సు ముద్దుపెట్టుకున్నదాకా
నీగోళ్ళపై మెరిసే మొదటి రవికిరణాలు
గోడలపై మెరిసిందాకా
నీ వక్షంలో ఉయ్యాలలూగే అనిలుడు,
నిట్టూర్చి అయిష్టంగా
లోకంలోకి తొంగి చూసిందాకా
చాచిన నీ చెయ్యి నాకోసం
పక్కమీద వెతుక్కున్నదాకా

అట్లాగే
అప్రమేయ అనిర్వాచనీయ ఆనందంలో
మైమరిచి కూచున్నాను!

౯౪

తేనె
    తన మాధుర్యంలో తానుమైమరిచినట్టు
ఆకాశం
    తన నీలంలో తాను మూర్ఛిల్లినట్టు
అగ్ని
    తన జ్వాలలో తాను వెలిగినట్టు
కాంతి
    తన తేజాన్ని తానే తాగినట్టు

ఆనందమే
    నేనైన నేను
        అంతులేని ఆనందాన్ని
            ఆస్వాదిస్తున్నాను అంతసేపూ!

౯౫

లలనా,

ఈ లోకమింతే!

ఏ సత్యమూ లేని

దూరమూ కాలమూ అనే పడుగుపేకలపై

జ్ఞానకాంతి మెరిపించే తళుకురూపాలు

ఇదో బొమ్మలాట!

ఇంతసేపూ తెరమీద

దెబ్బలాడిన కర్ణార్జునులు

కాలపేటికలో

కావలించుకు పడుకున్నారు!

ఆశాజనిత పవనోద్భూత
మనోతరంగ పరంపర శమిస్తేనేకాని
నిర్మల తేజోమండిత చిదాకాశం
మనోపారావారంపై
ప్రతిఫలించదు—

తన్వీ,
మనోనేత్రాన్ని
తెరు!

౭౬

ఉద్దేశ్యరహితమైన
ఆ చిద్విలాసం
రూపరస గంధ బద్ధమై
నీలో, నాలో, ప్రతివారిలో
ఆనంద విషాధ ఛాయలుగా
సఫలమౌతోంది

౮౭

తనలోంచి
తానే రేపుకున్న జీవనోద్రేకం
తన ఉద్వేగంతో తానే చింది
సంఖ్యాతీత ధవళతుషార
ఆనంత బిందువులై
"నేను, నేను"
అని స్పందిస్తోంది
అనంతంగా
అగణిత వివిధరూప నామ విలాసాలతో
నర్తిస్తోంది
జననమరణ లయబద్ధమై

౯౭

ప్రేమ, అందం, సుఖం
సంతోష రసాన్వితం—
ఈ ప్రపంచం:
నీమనసుపై నువ్వు
చిత్రించుకుంటున్న పటం!

తృప్తి నెరగక
ఆశకి లోనై
సరిదిద్దుకో చూస్తావు
ఆ పటాన్ని
క్షణక్షణమూ
మార్చుకుంటూ!

కాలమూ, దూరమూ
కల్పించుకుని
మాయనల్లుకుంటుంది
నీమనస్సు

౯౯

చెలీ, విను!
ఒకటే సూత్రం
ఒకటే మార్గం
ఒకటే ముక్తిసోపానం!

నీ కళ్ళ ఎదట కదిలే
అరుణాచల ఇంద్రజాలాన్ని
ఆలోచనారహితచిత్తవై విలోకించావా
కొండపై ఏరు ప్రవహించదు
చెట్లలో గాలికదలదు
నీటిలో తుంగవూగదు
ఆకాశాన మబ్బులాగుతాయి
పువ్వులు వాడిపోక
కట్టుపడతాయి!

మరుక్షణాన్ని
నీమనసులోకి తీసుకున్నావా
ఆక్షణం
ఈర్ష్యతో
తనమకరందాన్ని
దాచేసుకుంటుంది
నీకందనీక !

౧౦౦

ఈ క్షణంలోనే
ఈ ఆనందంలోనే నిలిచిపో
కాలాన్ని కదలకండా
నీమనస్సులో కట్టెయ్యి

బిగపట్టిన కళ్లెంమీద అనూరుడివేళ్లు
వొణకకండా నిలిచాయూ
సూర్యుడి రథచక్రాలు నిస్తబ్ధులౌతాయి

నీ శ్వాసని ఉచ్చువేసి
నీ మనసుగొంతుని బిగించు!

౧౦౧

పోనీ
    ప్రేమలో నిలిచిపో
ప్రేమ
    లోకాన్ని దేహాన్ని
    మోహాన్ని మరిపించే
ప్రేమ

కళ్లలోంచి మనసునిలాగి
    హృదయకుహర నీరవంలో నిలపగలప్రేమ
        ప్రేమలో
            ప్రతిక్షణానికాక్షణం నిలిచిపో!

నాచూపులో కట్టుబడి
    నీచూపుని ఆపు
        నీచూపు కదిలిందా
            నీమనసు కదులుతుంది
                నీమనసు కదిలిందా
                    ప్రపంచాలే కదులుతాయి!

౧౦౨

నేను నీకానందం
నువ్వు నాకానందం
ఇదంతా ఆనందం
నువ్వు నేననే
ఈ విభాగమే భ్రమ!

కళ్లు పైకెత్తావా
అంతుదొరకని అనంతాకాశం
చూపు లోనికి దించావా
లోతుదొరకని చిదాకాశం

నువ్వు
నాలుగుబారల శరీరమని
భ్రమించకు!

౧౦౩

చిత్తేజోపటంపై కదిలేనీడలు
నువ్వూ, నేనూ, వీళ్లూ—
వాస్తవం లేని రంగులు

మనసులేంది తెలుసుకునేవారు లేరు
తెలుసుకునేవారు లేంది నువ్వు లేవు
నువ్వే లేంది నీకెవరున్నారు

నువ్వు లేకముందు
ఈలోకం నీకుపట్టిందా
నువ్వు పోయింతరవాత
నువ్వేమైనావో లోకానికి పట్టిందా

లోకంలో లేదు మర్మం
మనసులో వుంది మాయఅంతా!

౧౦౪

మనసులేంది
నువ్వు లేవు
నువ్వులేంది
లోకం లేదు
లోకంలేంది
బాధలు లేవు
ఇంక ఆరాటమెవరికి,
ఎవరికోసం?

విశ్వ తేజస్సుకందనీక
మమతల్లో దాచుకున్న
మనసులోని నీడలే
బేధాలు, ఖేదాలు,
శోకాలు, రోగాలు

౧౦౫

దీనినించి నువ్వు వేరుకాదు
తెలిసేదీ తెలుసుకునేదీ
ఆనందమూ అనుభవమూ
అన్నీ నువ్వే

మనసనే తెరని ఎత్తావా
వరుడూ-వధువూ
ప్రియుడూ-ప్రేయసీ
ఒకే ప్రేమలో
ఐక్యమౌతారు!

౧౦౬

ఇదంతా ఏంలేదు
వుత్తతేజస్సు
అదీకాదు
ఏంలేదు
అంతావుంది
అంతావున్న ఏంలేదు

మనం అనుకునేది
మనం అనుకోగలిగింది
ఏదీకాదు
ఏంలేదంటే అదీకాదు
అసల్కు అనుకోడానికి ఏదీకాదు
ఏదీలేదు

అయితే ఏమిటో
అదే తెలుసుకో
మనసునాపి!

౧౦౭

ఈ మనసు మాడిందా
తెలుసుకునే మనస్సూ లేదు
తెలుసుకోడమనే పనీ లేదు
తెలుసుకోడానికేమీ లేదు

తెలుసుకునే మనసు
తెలిసేలోకం
తెలిపే ఈశ్వరుడు
అన్నీవొకటే

ఒకటే మౌనం
శబ్దాతీతమైన నిశ్శబ్దం
సమస్తమూ నిండిన
నిరామయం

ఈ

మూలసూత్రాన్నే
జ్ఞానమూర్తి స్కందుడు
కైలాసగిరిపై
తండ్రికి ఉపదేశించాడు

ఈ

నిగూఢ సత్యాన్నే
వటవృక్ష సమాశీనుడై
శ్రీమద్దక్షిణామూర్తి
తన్నర్థించిన సిద్ధులకి
అనుభవైక్యం చేసాడు

ఈ

వేదాంత రహస్యాన్నే
శ్రీ రమణ భగవాన్
వాక్ దృక్ స్థానాలతో
తన్నాశ్రయించిన ఆర్తుల
జ్ఞాన నేత్రాన్ని తెరిచారు.